# హరి గదికి ఒక బొమ్మ



# హరి గదికి ఒక బొమ్మ

క్రాకెట్ జాన్సన్





“నా గది గోడకి ఒక బొమ్మ

కావాలి," హరి అన్నాడు.



వంగ పన్నె క్రేయాన్ తీసుకుని

హరి ఒక ఇల్లు గీశాడు.

ఎన్నో ఇళ్లు కలిసి ఒక ఊరు తయారయ్యింది.

ఊరు చాలా దూరాన ఉంది.



ఊరికి అన్ని వైపులా అడవి,

కొండలూ ఉన్నాయి.

పొడవైన దారి చివరలో

ఊరు ఉంది.



“వెన్నెల రాత్రులలో ఊరు చాలా

అందంగా ఉంటుంది," హరి అన్నాడు.

బొమ్మలో అడుగు వేసి హరి

చంద్రుడిని గీశాడు.



అతడు ఇళ్లవైపు జాగ్రత్తగా చూశాడు.

“అరే, నేను పెద్ద రాక్షసుడి లాగా

ఉన్నాను!" హరి అన్నాడు.

నా అంత రాక్షసుడిని చూసి ఊరి

వాళ్లు భయపడతారు.



“అదృష్టం బాగుండి అందరూ

నిద్రపోతున్నారు. నన్ను ఎవ్వరూ

చూడలేదు," అనుకున్నాడు హరి.



అతడు కొండల వైపు వెళ్లాడు. “నేను ఎంత

పెద్దగా ఉన్నానో చూడు!" అతడు తనలో

తాను అనుకున్నాడు.



హరి తల మబ్బుల కంటే

ఎత్తులో ఉంది.



నాలుగు అడుగులు వేసేసరికి అతడు

భూమి అంచుకి చేరుకునా     .



భూమి అంతమైన చోటు నుంచి

సముద్రం మొదలయ్యింది.



"ఇది సముద్రం," హరి అన్నాడు,

“ఇవి గౌరు కాకులు."



హరి చాలా పెద్దగా ఉండటంతో

సముద్రంలో తేలికగా

నడవగలుగుతున్నాడు.



అతడి ముందు నుంచి ఒక పెద్ద

సముద్రపు ఓడ వెళ్లింది.



సముద్రపు అలల లోంచి ఒక

తిమింగలం వచ్చింది. దాని ముక్కు

నుంచి నీటిని పైకి చిమ్మింది.



అంతలోనే హరికి పాత రోజుల నాటి

తెరచాపల ఓడ వస్తూ కనిపించింది.



ఆ ఓడను హరి తేలికగా

దాటేశాడు.



సముద్రం అంతమైన చోట ఒక

కొండ ఉంది.



కొండమీదకి ఎక్కటానికి హరికి

కొన్ని పెద్ద రాళ్ల అవసరం

ఏర్పడింది.



అతడు సముద్రం లోంచి

కొండ మీదకి ఎక్కాడు.



ఓడ రాళ్ల దగ్గరకల్లా వచ్చేస్తోందని హరి
చూశాడు. అది రాళ్లను ఢీకొట్టే ప్రమాదం ఉంది.

నావికులను హెచ్చరించడానికి
అతడు ఒక దీప స్తంభం చేశాడు.



తరవాత కొండల మీదకి

హరి ఎక్కాడు.

ఎత్తైన కొండల కంటే హరి

ఎత్తుగా ఉన్నాడు.



“ఇక్కడ నేను అన్నింటి కంటే

ఎత్తుగా ఉన్నాను!" అన్నాడు హరి.

ఉన్నట్టుండి అతడికి ఒక

విమానం కనిపించింది.



చివరి క్షణంలో హరి తన

తలను దించాడు.



ఆ జెట్ విమానం వేగంగా అతడి

పక్క నుంచి వెళ్లిపోయింది.



ఒక పెద్ద ప్రమాదం

తృటిలో తప్పింది.



కొండల మధ్య హరికి ఒక

లోయ కనిపించింది.



రైలు మార్గం వెయ్యటానికి చాలా

అనువైన చోటు ఇది.



ఆ రైలు పట్టాలు విశాలమైన

మైదానం లోకి వెళ్లాయి.



రైలు పట్టాల దగ్గర హరి కొన్ని

పువ్వులను, పక్షులను వేశాడు.



“రైలు లోంచి అందమైన వాటిని చూడటం

ప్రజలు ఇష్టపడతారు," హరి అన్నాడు.



రైలు పట్టాలు, పక్షులు, పూలు

చేస్తూ హరి ముందుకు వెళ్లాడు.



రైలు బండి వస్తోందేమోనని అతడు

మాటిమాటికి వెనక్కి తిరిగి చూస్తున్నాడు.



ఒక చిన్న పిల్లవాడికి ఇది

చాలా పెద్ద పని.



ఉన్నట్టుండి తాను చాలా చిన్నవాడినై

పోయానని హరికి అనిపించింది.



ఇప్పుడు అతడు పువ్వు

కంటే చిన్నగా ఉన్నాడు!



పక్షి కంటే కూడా అతడు చిన్నగా ఉన్నాడు!

ఇప్పుడు అతడు ఇంటికి ఎలా చేరుకుంటాడు?



ఉన్నట్టుండి అతడు ఒక ఎలక

కలుగులో పడిపోయాడు.



“నన్ను మన్నించు,” అతడు

ఎలకతో అన్నాడు.



అతడు ఆలోచించటానికి ఒక

రాయి మీద కూర్చున్నాడు.



మళ్లీ వెంటనే అతడు లేచి నిలబడ్డాడు.



“ఇది బొమ్మ మాత్రమే," హరి

అన్నాడు.



అతడు తన క్రేయాన్‌తో

ఆ బొమ్మను కొట్టేశాడు.



“నేను పెద్ద రాక్షసుడినీ కాదు, చిన్న మరుగుజ్జునీ

కాదు. నేను నేనే!" హరి అనుకున్నాడు.

కానీ, ఆ సంగతిని కచ్చితంగా

నిర్ధారించుకోవటం ఎలా?





ఇంటి దగ్గర ఎప్పుడూ అతడు

తన అంతే ఉంటాడు.



దాంతో అతడు తన గది

తలుపుని గీశాడు.



తలుపు వెనక ఒక పెద్ద,

నిలువు అద్దం ఉంది.



"అవును. నేను నా అంతే

ఉన్నాను!" హరి అనుకున్నాడు.



తన గదికి తిరిగి వచ్చినందుకు హరికి

సంతోషంగా ఉంది. అతడు అలసిపోయాడు.

అయితే గోడకి తగిలించటానికి

అతడి దగ్గర బొమ్మ ఏదీ లేదు



అందుకే, నిద్రపోటానికి ముందు

గోడ మీద ఒక బొమ్మ వేశాడు.

అయిపోయింది.